# వేణీసంహారము

భట్టనారాయణుని

సంస్కృతనాటకమునకు తెలుగుసేత







బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.

# వేణీసంహారము




కృతికర్త.

# వేణీసంహారము




కృతికర్త.

# అంకితము

౧

శ్రీగురుదేవదేవునకుఁ జిన్మయరూపున కాదిదేవనా
నాగమవేదికిన్ బరమహర్షికి నిర్జితకామికిన్ గృపా
శ్రీగుణరాశికిన్ సకలసిద్ధివశీకృతబాహుశాలికిన్
త్యాగగుణాబ్ధికిన్ బరమతత్త్వరహస్యున కాత్మవేదికిన్.

౨

నాకు సమస్త మైనయతినాథునకున్ బరమాత్మఁ గన్న సు
శ్లోకునకున్ జగద్విదితశుద్ధచరిత్రున కాదిదేవతే
జోకమనీయరూపునకు సూనృతనిష్ఠునకున్ సమస్తశో
భాకృతికిన్ జగద్దురితపాపనతేజున కాత్మమూర్తికిన్.

౩

ఆర్షకులాభిజాతునకు నార్షగుణోదధికిన్ నిరంతరా
కర్షితభక్తభక్తునకు గానకళాకమనీయవేదికిన్
హర్షసమున్నతాత్మున కనంతకృపానిధికిన్ మహర్షి కా
ర్యర్షికి జ్ఞానవర్షి కిది యంకిత మౌత! సభక్తికంబుగన్.

౪

ఆముఖపద్మమందుఁ బరమాత్మ నిరంతరగోచరంబు తే
జోమయ మైనరూపమునఁ జూపుల కందనిదై యమానుష
శ్రీమహనీయమై ఋషివరేణ్యదృగంచలసన్నిధానమై
యామహనీయరూపమున కంజలి నిల్పెద నెల్లవేళలన్.

---

# పీఠిక

## ౧

సుప్రసిద్ధములై నేఁటికిని సంతతపఠనపాఠనవ్యవహారమునఁ గానవచ్చుచున్న సంస్కృతనాటకములలో మృగరాజలక్షణుఁడైన భట్టనారాయణుని "వేణీసంహార" మొకటి. ఈభట్టనారాయణుని కాలము నిదమిత్థమని నిర్ణయించుటకుఁ దగినయాధారము లంతగా లేవుకాని, వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తియందును నభినవగుప్తుఁడు ధ్వన్యాలోకమునందు నీతని "వేణీసంహారము" నుండి కొన్నిశ్లోకముల నుద్ధరించియుండుటచే నీతఁడు వారికాలమునకే ప్రఖ్యాతుఁడై యుండెననియు బహుశః క్రీ. శ. ఏడవశతాబ్దియుత్తరార్ధమున జీవించియుండు ననియు విమర్శకు లూహించుచున్నారు. పైని పేర్కొనఁబడినవారిరువురే కాక యింకను బలువురు లాక్షణికులును గవులును భట్టనారాయణుని వేణీసంహారము నుదాహరణముగను నాదర్శముగను గ్రహించుటనుబట్టి యప్పటి పండితులలో నీతనికిఁ గలగౌరవము వెల్లడియగుచున్నది. ధనంజయుఁడు దశరూపకమున వేణీసంహారమునుండి పలుచోట్ల నుదాహరణము లొసంగియుండెను. రాజశేఖరుఁడు తనబాలరామాయణమున నచ్చటచ్చట వేణీసంహారము ననుకరించె నని చెప్పుటకు నిదర్శనము లున్నవి. భట్టనారాయణుఁడు వేణీసంహారమున నాటకలక్షణముల నన్నింటిని సమగ్రముగా ననుసంధింప యత్నించి యందుఁ గృతార్థుఁ డయ్యెను. ఈదృష్టితోఁ జూచిన వేణీసంహారము సంస్కృతనాటకవాఙ్మయమున నద్వితీయమై యలరారుచుండును.

దుశ్శాసనుఁడు సాధ్వియైనద్రౌపదిని గొప్పపట్టి సభలోని కీడ్చి వలువ లొలిచి పరాభవించెను. ఆపరాభవమునకుఁ బ్రతీకారము జరుగువఱకుఁ దన కొప్పు ముడిపెట్టనని యామె ప్రతినపట్టెను. ప్రియసాహసుఁడైన భీముఁడు తనగదాదండముచే దుర్యోధనునియూరులు విఱుగనడిచి తద్రక్తసిక్తములైన చేతులతో ద్రోవది వేణి ముడిపెట్టెను. రసభరితమైన యీసన్ని

వేశమునుండియే నాటకమునకు "వేణీసంహార" మనుపేరు కలిగినది. నాలు
గవ యంకమున సుందరకుడు చెప్పిన యుద్ధ వృత్తాంతమువంటి యనాటకో
చిత కథనఘట్టములు కొన్ని యున్నను నీనాటకమునకు వన్నె చేకూర్చిన
సన్నివేశము లెన్నియో కలవు. తృతీయాంకమునందలి వాగ్వివాదరంగమున
సంభాషణక్రమసౌందర్యము పరాకాష్ఠ నందియున్నది. వీరముతోపాటు
శృంగారరౌద్రకరుణారసములును నిందుc జక్కcగాc బోషింపcబడియే.
యున్నవి, ఇంకc బాత్రపోషణమున భట్టనారాయణుcడు ప్రదర్శించిన
నేర్పు మిక్కిలి ప్రశంసాపాత్రముగ నున్నది. ద్రౌపదీభానుమతు లాదర్శపతి
వ్రతలుగాc జిత్రింపcబడినారు. దుర్యోధనుని యౌద్ధత్యమును, భీముని వీరో
దాత్తతను, యుధిష్ఠిరుని శాంతప్రజానురాగములను, కృష్ణుని సమయోచిత
వాక్చాతుర్యమును, కర్ణాశ్వత్థామల పరస్పరోపాలంభములను, గాంధారీ
ధృతరాష్ట్రుల పుత్రప్రేమను కవి చక్కcగాc బోషించియుండెను. చార్వా
క పాత్ర కల్పనము నాటకానురక్తిని పలువిధములc బెంపొందించుచున్నది.
శృంగారమున కిందంతగా స్థానము లేకున్నను కవి బలవంతముగా దాని
నిందుc జొప్పించి పూర్వనాటకసంప్రదాయమునకు లోcగినవాcడయ్యెను.

ఇంక ననువాదము విషయము. దీని ననువదించినవారు సర్వాంధ్రజన
విదితులును, పండితాగ్రేసరులును, బహుగ్రంధరచనా ధురంధరులును,
నిఘంటునిర్మాణనిపుణులు నగు శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు. వారిది
వఱకే దిఙ్నాగుని కుందమాలను, భాసుని యభిషేకనాటకమును తెనుc
గున ననువదించి తమ యనువాదనైపుణ్యమును ప్రదర్శించియున్నారు. ఇం
దలి యనువాదము సర్వవిధముల జక్కcగా నున్నది శ్రీవేంకటేశ్వరులుగారి
హృదయమువలెనే వారిశైలియుc బ్రసన్నమైనది; వారి వర్తనము వలెనే
భాషయు ననవద్యమైనది; వారి దృష్టివలెనే రచనయు మిక్కిలి నిశిత
మైనది. వారిగ్రంథము లిహపరములకు వంతెనలు. అవి వారి హృదయ
మున నెలకొన్న యాధ్యాత్మికతానుషంగమునకు విమలాదర్శములు. ఏపూర్వ
జన్మసుకృతముచేతనో నే నార్జించుకొన్న వారితోడి నెయ్యముతప్ప నీపీఠిక
వ్రాయుటలో నాకొండు పాత్రత లేదు.

ఆంధ్రభాషయందలి యనువాదములు మూఁడు తెఱఁగులుగా నున్నవి. కథానువాదములు, భావానువాదములు, పదానువాదములు అందుఁ గవి త్రయమువారి భారతము మొదటితెగకుఁ జెందినట్టిది. ఈపద్ధతి పేరున కనువాదమే కాని చాలఁగ స్వతంత్రమైనదే. రెండవపద్ధతికి శ్రీనాథుని నైషధాంధ్రీకరణము తార్కాణ. ఇది మూలవిధేయమయ్యు స్వతంత్ర మైనది. ఆధునిక కాలమునందలి సంస్కృతనాటకాంధ్రీకరణములు పెక్కు మూఁడవపద్ధతికిఁ జెందును. ఇవి స్వతంత్రత యేమాత్రమును లేని మూలమున కతివిధేయములైన పదానువాదములు. మూలసాహాయ్యము లేక యిందలి భావములను గనుఁగొనుట పెక్కుచోట్లఁ గష్టసాధ్యముగా నుండును. నాకుఁ దోఁచఁగా నీమూఁడు పద్ధతులలో రెండవదైన భావానువాదపద్ధతి ప్రశస్తముగాఁ గనుపడును. ఏలయన నది మూలమున కవిధేయమును గాదు అతివిధేయమును గాదు. శ్రీవేంకటేశ్వరులుగారి యనువాద మీపద్ధతికిఁ జెందినది యమందానందకమును జేకూర్చుచున్నది.

నిజము పరికించఁగా స్వతంత్రరచనమున కంటె ననువాదమునఁ గ్లేశము హెచ్చు. స్వతంత్రరచనమునఁ గవిచ్ఛందోనుగుణముగా భావము నించుటకు మార్చుకొనవచ్చును. మఱి యనువాదమున నాపదచ్ఛందము లనే మార్చుకొనవలెనుగాని భావావిష్కరణమున నించుకయు మూలము నధిగమించి పోరాదు ఇట్లు పోయితిమా యనువాద మెంత మృదుమనోహరము గానున్నను మూలమును దృష్టియందుంచుకొని చూచువారి కది యసంబద్ధముగా గోచరించును. అందుచే ననువాదమును సర్వజనానందకరముగా సంతరించుట యసిధారావ్రతము వంటిది. దుష్కరమైన యీవ్రతమును శ్రీవేంకటేశ్వరులుగారు రవలీలమై నిర్వహించిరన్నచో నించుకయు నతిశయోక్తి యుండఁజాలదు.

అనువాదమున సాధారణముగా భావము యథామూలముగనే ప్రకటింపఁబడినను మూలమునందున్న కొన్ని పదములు లోపించుటయో లేని కొన్ని పదములు చేరుటయో సంభవించుచుండును. అధికముగా వాడఁబడిన పద

సర్వరససంభరితమై జగత్ప్రసిద్ధి గాంచిన "వేణీసంహారనాటకము" తొలుదొలుత క్రీ. శ. ౧౮౮౨వ సంవత్సరమున కీ. శే. వడ్డాది సుబ్బారాయఁడుగా రాంధ్రీకరించి ౧౮౮౮ లోఁ బ్రకటించిరి. తరువాత దీనిని శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రికవిసార్వభౌములు ననువదించి ప్రకటించిరి. వ. సు. రాయకవిగారియాంధ్రీకృతి యిదాఁకుముద్రణము లంగనది. ఆతరువాత నెవరో యొక్కరు వేణీసంహారమును సంగ్రహించి ప్రకటించిరి కాని, నాఁటినుండి నేఁటివఱకు మఱియెవ్వరు నీనాటకముజోలికిఁ బోయియుండ లేదు. ఇటీవల నేను సంస్కృతవేణీసంహారముఁ జదువుచుండ మరల దీని ననువదింపవలసినయవసరము కల దని నాకుఁ దోఁచి నే నచిరకాలముననే దీని నాంధ్రీకరించితిని. దీనిని గన్నవిద్వద్వతంసు లిది పూర్వానువాదముల కేమాత్రమును దీసికట్టు కాకపోవుటే కాక యెన్నివిషయములలోనో మిన్న యని నన్ను దీనిప్రకటనకుఁ బ్రోత్సహించిరి. అది వారికి నాపైఁ గలయవ్యాజవాత్సల్య మని నేను గ్రహించి నాకు మార్గదర్శకు లైన వ. సు. రాయ కృష్ణమూర్తిశాస్త్రి కవివరులను గృతజ్ఞతావందనములతో సంస్మరించి నేను గృతకృత్యుఁడ నైతిని. రసికవతంసు లిందలిగుణలేశమునే గ్రహింతురు గాక!

భట్టనారాయణుని కాలము, దేశము, పాండిత్యములను గుఱించియు వేణీసంహారమందలి రస నాయక చర్చను గుఱించియు నెంతయో వ్రాయఁ దలఁచితిని గాని కాలస్థలాభావములు నా కాయవకాశమును గలుగనీయ లేదు. నాయీకృతిని సాదరమునఁ దిలకించి పీఠిక వ్రాసి నన్ను గౌరవించినమిత్త్రరత్నము లగు(శ్రీ)దివాకర్ల వేంకటావధానిగారికి నే నెంతయో కృతజ్ఞుఁడను. దీని నచిరకాలమున నత్యంతసుందరముగా ముద్రించిన ఆంధ్రప్రచారిణీముద్రాశాలవారికి నాకృతజ్ఞతావందనములు.

నేఁటినాటకరంగప్రదర్శనమున కిది యనుకూలము కాదని వేఱ చెప్పనక్కఱ లేదు. నాయనువాద మందుకొఱ కుద్దిష్టమును గాదు. సారస్వతదృష్టితో దీనిని గాంచి యానందించు సహృదయులకే యిది యుద్దిష్టము. వా రామోదించిన నా కదియే పదివేలు.

ఖరచైత్రశు౧. ఉగాది
7—4—51
కాకినాడ.

బులుసు వేంకటేశ్వరులు. బి. ఏ.
[సంపాదకుఁడు, వావిళ్ల నిఘంటువు.
ఆంధ్రపండితుఁడు, పి. ఆర్. కాలేజి.]

# నాటక పాత్రలు

యుధిష్ఠిరుఁడు
భీమసేనుఁడు
అర్జునుఁడు
నకులుఁడు
సహదేవుఁడు

కృష్ణుఁడు

ధృతరాష్ట్రుఁడు
దుర్యోధనుఁడు
కర్ణుఁడు
కృపుఁడు
అశ్వత్థామ
సంజయుఁడు
సుందరకుఁడు
జయంధరుఁడు
వినయంధరుఁడు
చార్వాకుఁడు
రాక్షసుఁడు

ద్రౌపది
భానుమతి
గాంధారి
దుస్సల
జయద్రథమాత
రాక్షసి
చేటి, నటి

శ్రీ

# వేణీసంహారము

## నాంది

శ్రీదామోదర దైవతంబు, భువన
శ్రేణీమహాధారము
ఖ్యాదేశంబు, స్వనాభిరంధ్రమహితో
ద్యల్లోకబీజంబు, నా
భీ దేశాంతర సంప్రతిష్ఠిత మహా
విశ్వాండభాండంబు, సం
హ్లాదాంభోనిధి, స్వప్రకాశమున ని
త్యజ్యోతియై వెల్గుతన్ ! ౧

శా. క్షీరాంభోనిధిమధ్యమందుఁ గృపతో
శేషాహిపర్యంకమం
దారూఢుం డయి చిద్విలాసముఁ బ్ర
హ్మానందసందోహ స
త్పారావార మసంగఁ జెన్నలరు సం
భద్వేణువిద్యాకళా
పారీణుం డగుకృష్ణదేవుఁడు జగ
ద్భద్రాత్ముఁ డేపారుతన్ ! ౨

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూత్ర:—పలుపలుకు లేల ?

క. భారత మనునమృతం బం
పారఁగ శ్రుతిపేయ మహాప్రబంధ మొనర్చెన్

నెగడుచుఁ బాండునందనులు
నీరజనాభునితో సుఖింప న
త్యగణితరక్తసాధితమ
హావనులై క్షతవిగ్రహాత్వ మన్
వగను గడించి కౌరవులు
బంధులతోడుత స్వస్థు లయ్యెదర్ ! ౬
(తెరలో: తిరస్కారపూర్వకముగా)
ఓరీ! పాపీ! దురాత్మా! ముఖస్తుతిపాఠకా! నటకాధమా!
నే నుండఁగనే కౌరవు లెల్ల సుఖింతురురా ?
చ. కనికర మీఁగి లక్కయిలు
గాల్చి విషాన్నము పెట్టి జూదపుం
బెనుమిష రచ్చ కీడ్చి బహు
విత్తములన్ గొని మానభంగమున్
బొనరుప సాధ్వి ద్రౌపదిని
బుణ్య సభన్ సిగఁబట్టి చీర లూ
డ్చినఖలధార్తరాష్ట్రులు వ
సింతురె స్వస్థత నేను గల్గఁగన్ ? ౭
పారి:—ఆఁ. ఆఁ. అది యేమి ?
సూత్ర:—(వెనుకకుఁ జూచి) కృష్ణుఁడు కౌరవులతో సంధి చేయఁబోవుట కొల్లక భీమసేనుఁడు రౌద్రరసమూర్తియై కంటికగపడినవారి నెల్లర మ్రింగివేయునో యనునట్లు మహాకోపియై తమ్ముఁ డగు సహదేవునితో నిటే వచ్చుచున్నాఁడు. అతని కంటికి మన మగపడరాదు. మఱొకచోటికేఁగుదమురమ్ము.
(నిష్క్రమింతురు)
ఇది ప్రస్తావన.

# వేణీసంహారము

---

## ప్రథమాంకము

(కోపిష్ఠుండై సహదేవునితో భీమసేనుఁడు ప్రవేశించుచు)

భీమ:—ఓరీ! పాపీ! దురాత్మా! ముఖస్తుతిపాఠకా! నటకాధమా!

("కనికర మీఁగి లక్కయిలు గాల్చి .. " మరలఁ జదువును)

సహ:—(అనునయించుచు) ఆర్యా! శమింపుఁడు. శమింపుఁడు. ఈ నటకులవచనము మన కిష్టమేకదా! ఏలన,

చ. "పగ యనునగ్ని చల్లఁగాఁ
వైరిగణంబు లణంగిపోవఁగా
నెగడుచుఁ బాండునందనులు
నీరజనాభునితో సుఖింప"

అన్నంతవఱకు మీ కభ్యంతరము లేదుకదా! ఇఁక:

"అత్యగణితరక్తసాధితమ
హానను లై క్షతవిగ్రహాత్మ మౌ
వగను గశించి కౌరవులు
బంధులతోడుత స్వస్థు లయ్యెదర్."

అనఁగా క్షతశరీరులై కౌరవులు సబంధుకముగా స్వర్గము నందుదురుగాక యనికదా భావము!

భీమ:—(నిందాసూచకముగా) ఔ నౌను. మీరు కౌరవుల కనుం గళ మెన్నకుఁడు. పాపము వారు మీరాఁగా సోదరులుకదా! సంధియే చేయుఁడు.

సహ:—(కోపముతో) ఆర్యా!

గీ. మాటిమాటికి వైరంబు మలిచి పెలిచి
కయ్యమున కిట్లు కాల్ద్రిప్పు కౌరవాళి
నెవఁడు క్షమియించు నీభ్రాత లింకనుందు
ధర్మజుం డట్లు వారింపఁ దలఁపకున్న? ౮

భీమ:—ఔను. అందుచేతనే మీకు నేను వేఁడుకొనుచున్నాను.

ఉ. పిన్నతనంబునుండియుఁ బ్ర
వృద్ధము వైరము కౌరవాళితోఁ
గ్నన్న యుధిష్ఠిరుండు మఱి
యర్జునుఁ డీవును గారు కారకుల్;
పన్నుఁడు మీరు సంధి; మఱి
భగ్న మొనర్చును భీముఁ డద్ది; క్రో
ధోన్నతిఁ దొల్త మాగధమ
హారము వచ్చినరీతి నెన్నఁగన్. ౯

సహ:—(అనునయముతో) ఆర్యా! ఈ నీ కోపముఁ గన్న నన్న ఖిన్నుఁ డగుఁగదా!

భీమ:—ఏమి! అన్న ఖిన్నుఁ డగునా!! ఖేదమున్న నేమో యన్న యెఱుఁగనే యెఱుఁగఁడుకదా! ఏలన:

చ. కురుసభ నట్లు బన్నములఁ
గూరిన ద్రౌపదిఁ గాంచి, వల్కలాం

ఒరు లగు వ్యాధులన్ గిలిచి
వర్తిలి కానన భూములందు, న
వ్విరటన్నృపాలుపాల ...తి
విహ్వలతన్ బడియుండు నాపయిన్
గురుకను లేదు జాలి; కలు
గుంగద! కౌరవులందు నేరికిన్. ౧౦

అందుచే నీవు పోయి చిరకాలమునుండి పెరిగి పెంపుగాంచిన నాక్రోధసహంబులకు లామహారాజున కిట్లని విన్నవింపుము:

సహ:—ఎట్లు?

భీమ:—ఇట్లు:

మ. భవదాజ్ఞాపరిలంఘనాత్మకమహా
పాపాబ్ధి నిర్మగ్నతా
భవదీయాఖిలసోదరాధమ మహా
పఖ్యాతి నాకైనం గో
పరిఘూర్ణప్రతిశోణితారుణగదా
పర్వంబుగాం గ్రుంతుం గౌ
రవులన్; గా మింక నన్నదిమ్ములపు గా
రా దొక్క యీనాంటికిన్. ౧౧

(ఉద్ధతితో నడచును)

సహ:—(భీమసేను ననుసరించుచు, తనలో) ఓహో! ఏమి! ఆర్యుండు పాంచాలి చతుశ్శాలలోనికిం బోవుచున్నాండు. నే నిట నిలిచెదను. (కూర్చుండును)

భీమ:—(వెనుదిరిగి చూచి) సహదేవా! నీవు పొమ్ము. గురునితో నుండుము. నే నీయాయుధాగారమున కేఁగి సాయుధుఁడ నగుదును.

సహ:—ఆర్యా! ఇది యాయుధాగారము కాదు. పాంచాలి చతుశ్శాల.

భీమ:—(పరికించి) అట్లనా? సరే. పాంచాలితో మాటాడెదను. (సహదేవునిచేయి పట్టుకొని) వత్సా! అన్న యుధిష్ఠిరుఁడు కౌరవులతో సంధి కిచ్చగించి మన కెట్టిపీడ కలిగించినాఁడో!

(ఉభయులు ప్రవేశింతురు)

సహ:—ఆర్యా! ఈయాసనమునఁ గూర్చుండుఁడు. కృష్ణ యిప్పుడే వచ్చును.

(ఇరువురుఁ గూర్చుందురు)

భీమ:—వత్సా! కృష్ణ యన్న జ్ఞప్తికి వచ్చినది. ఎట్టి పద్ధతులకు లోఁబడి సంధిచేయ మన యుధిష్ఠిరుఁడు కృష్ణభగవానుని దుర్యోధనుని కడ కంపెను?

సహ:—ఆర్యా! ఐదూళ్లు మన కిచ్చుటకు.

భీమ:—(చెవులు మూసికొని) ఆహాహా! అన్న యజాతశత్రు నైనను నింతపరాక్రమహీనుఁ డని నిజముగా నామనసు కలఁగి పోయినది. సరిలే. ఈమాట నీవు చెప్పను లేదు. నేను వినను లేదు అనుకొందునులే. (ప్రక్కకు దిరిగి)

గీ. ఉగ్రమును నూర్జితంబన నొప్పుగన్న
క్షాత్త్రతేజంబు ధర్మరాజ ప్రసిద్ధుఁ
డితఁడు జూదము నాడంగ నెపుడు చేతఁ
బట్టెఁ బాచిక లప్పుడే వదలె నీని. ౧౨

(తెరలో)

దేవీ ! ఊఱకొను మూఱకొనుము.

సహ:—(తెరవంకఁ జూచి తనలో) అయ్యో ! ఏమిది ! ద్రౌపది యెడతెగక క్రమ్ము కన్నీటితో సఖీ యన్న సమీపమునకు వచ్చుచున్నది. ఏదో మహాకష్టము ముంచుకొని వచ్చుచున్నట్లు తోఁచుచున్నది.

గీ. అన్న కోపంబువలన నుత్పన్న మయ్యె
వైద్యుతాగ్నిగ జ్యోతి యూఁపగిది నిప్పుడె;
దానిఁ బెంపొందఁజేయు నీద్రౌపది యిట
వర్షఋతువట్లు లేఁతి వచ్చె నిపుడు. 13

(అంతఁ జేటి, కన్నీటితో ద్రౌపది, ప్రవేశింతురు.)

చేటి:—దేవీ ! ఊఱకొను మూఱకొనుము. నీ దుఃఖమును సత్యకౌరవవిరోధి యగుభీమసేనకుమారుఁడు పోనడఁచును.

ద్రౌప:—మహారాజు దీనికిఁ బ్రతికూలుఁడు కాకున్న.

చేటి:—(చూచి) దేవీ ! భీమసేనుఁ డిటనే యున్నాఁడు. చెంత కేఁగుము.

ద్రౌప:—సరే.

(ఇరువురును సమీపింతురు.)

చేటి:—(చేరి) జయము జయము కుమారా !

భీమ:—(చూడక)

"గీ. ఉగ్రమును నూర్జితం బన...(మరలఁ జదువును.)

చేటి:—దేవీ ! భీమసేనుఁడు మిక్కిలి కోపముతో నున్నట్లున్నాఁడు.

ద్రౌప:—చెలీ! ఐనచో నా కీతిరస్కారమే యూఅడింపు. ఇటనే
కూర్చుండి నాథునియూహ యేమో తెలిసికొందును.

(ఇరువురును గూర్చుందురు.)

భీమ:—(క్రోధముతో) వత్సా! ఏమి! ఐదూళ్లకా సంధి?

చ. సమరమునందుఁ గోపమునఁ

జంపనె నూర్గురు ధార్తరాష్ట్రులన్?

దమిమెయి దుస్ససేనునెడఁ

దన్ గడు ద్రచ్చియు నెత్రుఁ ద్రావనే?

సమదగదన్ సుయోధన ని

పాదునియూరులు నుగ్గుసేయనే?

శ్రమపడి రాజు సిగ్గు విడి

సంధియె చేసినఁ జేయని మ్మికన్. ౧౪

ద్రౌప:—(సంతోషముతో) నాథా! ఇట్టి యమృతతుల్యము
లగుమాటలు నే నెన్నఁడును వినలేదు. ఏది! యింకొకమా
అనుము.

భీమ:—

"చ. సమరమునందు..." (మరలఁ జదువును.)

సహ:—ఆర్యా! మహారాజు సంధిసందేశ మంతగా మీకు
నచ్చలేదా?

భీమ:—అస లాసందేశ మేమి?

సహ:—రాజసందేశ మిది.

భీమ:—ఎవరికి?

సహ:—సుయోధనునకు. ఏమని యనఁగా,

క. పనుపడ నింద్రప్రస్థం
బనఁగ వృకప్రస్థమును జయంతం బనఁగా
ననువొప్ప వారణావత
మనఁగ నొసఁగి పిదప నొసఁగు మైదవ దేదే. ౧౫

భీమ:—ఐన ?

సహ:—అన్న నాలుగే చెప్పి మైదవయూరు చెప్పకపోవుట విసపుఁగూడు, లక్కయింటికాల్పు, జూదపురచ్చ కీడ్చుట, చీర లొలుచుట యనున వెత్తిపొడుచుటకే.

భీమ:—(సాటోపముగా) ఐనమాత్రము ?

సహ:—ఆర్యా! దీనివలన మహారాజుమనస్సు స్వకులక్షయ మన్న జంకున దనియుఁ గురురాజు సంధికామి కాఁడని యును లోకమ్మునకు విదిత మగును.

భీమ:—ఈరెండు నర్థరహితములే. ఏలన, ఏనాఁడు మన మడవులపాలయి కురుకులక్షయ మొనరింప శపథము పట్టితిమో యానాఁడే కౌరవులతోడి సంధి కారా దనియుఁ గురుకులము నశింపవలసియున్న దనియు లోకమునకుఁ దెలియును.

సహ:—(సిగ్గుపడును.)

భీమ:—లోకమునఁ గురుకులనాశన మన్న మీకింత లజ్జయేల? ఏమిమూర్ఖత !

గీ. క్రోధమున శత్రుకోటిని ద్రుంచు టనఁగ
మీకు నగుఁబాటుగాఁ దోఁచు లోకమునను !

సతిని సిగఁబట్టి సభ నీడ్చి శత్రు వొకఁడు
వలువ లొలువఁగఁ గన నగుఁబాటు కాదు !  ౧౬

ద్రౌప:—(జనాంతికముగా) నాథా! వీరికి సిగ్గు లేదు. నిజము. సిగ్గు లేదు. నీవైన నామాట మఱవకుము.

భీమ:—వత్సా! పాంచాలి రాదేమి ?

సహ:—ఆర్యా! ఆమె వచ్చి చాలసేపయినది. నీవు కోపావేశమునఁ గనవైతివి.

భీమ:—(చూచి యాదరముతో) దేవీ! నే నీకోపసమయమున నీరాక యెఱుఁగనైతిని. దగ్గఱ నున్నను నిన్నుఁ గననైతి. ఏమియు ననుకొనకుము.

ద్రౌప:—నాథా! మీ రుదాసీనులై యున్న ననుకొందును గాని యిట్టి కోపసమయమున నున్న నెన్నఁడు ననుకొనను.

భీమ:—సరే. నీ పరాభవము నేఁటితోఁ దొలఁగిన దని భావింపుము. (చేయి పట్టుకొని దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని ముఖము చూచి) దేవీ! ఇట్లు విచారముతో నున్నావేమి ?

ద్రౌప:—నాథా! మీ దగ్గఱ నాకు విచార మెక్కడిది ?

భీమ:—చెప్పవేమి ? (సిగఁ జూచి) ఇఁక, వేఱే చెప్ప నక్కఱ లేదులే.

గీ. పాండునందను లందఱు బ్రతికియుండి
సరసఁ గవగూడి యున్నఁ బాంచాలరాజ
తనయ సుమకోమలాంగి యుత్తమచరిత్ర
యిట్టి దురవస్థ నున్న దిం కేమి చెప్ప ?  ౧౭

భీమ:—సహదేవా! వినుచున్నావుగదా!

సహ:—ఆర్యా! అది యజ్ఞసే. అని దుర్యోధనుని భార్య కాదా! మఱి యింక నేమి?

గీ. మగల సాహచర్యంబున మగువలకును
మాఱిపోవును గద! మఱి మగలవలెనె
వినపుఁజెట్టును బెనఁగొన్న వెనుక మధుర
వల్లియును మూర్ఛపుచ్చి చంపం గడంగు. ౧౯

భీమ:—చేటీ! దానికి దేవి యే మన్నది?

చేటి:—దేవా! నేను లేకున్నఁగదా దేవి పలుకుట?

భీమ:—సరే. నీ వేమంటివి?

చేటి:—"ఓసీ! భానుమతీ! మీమీసిగలు విడివడకమునుపే మా దేవి సిగ యెట్లు ముడివేసికొనునే?" అని.

భీమ:—(ఆనందముతో) సెబాస్. బుద్ధిమతీ! సెబాస్. ఎంత చక్కఁగాఁ బలికితివే! దీని కిదే నీకు నా పారితోషికము. (ఆభరణ మిచ్చును.) ఓ పాంచాలీ! (ఆసనమునుండి లేచి) దుఃఖింపకుము. అచిరకాలముననే నేఁ జేయునది చెప్పెద విను;

చ. గిరగిరఁ ద్రిప్పుకొంచు గద
కిన్క సుయోధను నూరుయుగ్మము
ద్ధుర రభసంబునన్ జదిపి
దుత్తుమురై పడ, వేఁడి వేఁడి నె
త్తురు గొని చేతులన్ గురుల
దువ్వి మెఱుంగిడి భీమసేనుఁ డో
తరుణిరో! చిక్కుదీసి ప్రమ
దం బొదవన్ ముడివేయు నమ్ముమీ! ౨౦

ద్రౌప:—నాథా! నీవు తలఁచినఁ జేయలేని దేది? మీయన్న
దమ్ములు దయచూపవలయునే కాని.

సహ:—అది మాకునైత మిష్టమే.

(తెరలో గొప్ప కలకలము. అంద ఱాశ్చర్యముతో వినుదురు)

భీమ:—

సీ. ఘూర్ణాయమాన మహా ఘోర వార్నిధిమధ్యఁ
జలియించు మందరాచలమునట్లు
కోణఘాతంబుచే గురుతరం బగుగర్జ
ఘూర్ణించు ప్రళయమేఘంబురీతి
పరమపాండవసతీ చిరతరోగ్రక్రోధ
దుర్వార మహానగ్రదూత భంగి
కౌరవ్యవంశ సంక్షయ నిమిత్తంబుగా
బయలుదేఱిన చండవాయువుగతి

గీ. ధ్వానధీరత సంఘట్ట చండతయును
నుగ్రనిర్ఘాత లక్షణం బొప్ప నాదు
సింహనాదానుకారి యహాచెలువు తోఁప
విజయరణ దుందుభిధ్వని వినుము వత్స! ౨౧

కంచు:—(సంభ్రాంతుఁడై ప్రవేశించి) కుమారా! శ్రీకృష్ణభగ
వానులు...

(అందఱు కృతాంజలులై లేతురు.)

భీమ:—భగవానుఁ డెక్కడ?

కంచు:—పాండవపక్షపాతి యని కౌరవులచే బద్ధుఁడగుట
కేగినాఁడు.

(అంద ఱాశ్చర్య మందుదురు.)

భీమ:—ఏమి ! ఆతనిని బంధించిరా ?

కంచు:—లేదు. లేదు. అంతవఱకు వచ్చినది.

భీమ:—అప్పుడు భగవానుఁ డేమి చేసెను ?

కంచు:—ఆమహాత్ముఁడు విశ్వరూపమును జూపి మాతేజముచే గురుకులము మూర్ఛపోఁగా మన శిబిరమునకు కదలెంచి త్వరలో నిచ్చటికిఁ జేరుకొనుచున్నాఁడు.

భీమ:—(నవ్వుచు) ఏమేమి! దురాత్ముఁ డగు దుర్యోధనుఁడు భగవంతునే కట్టివేయఁ జూచినాఁడా? (ఆకాశముఁ జూచి) దురాత్మా! కురుకులపాంసనా! ఈమర్యాదాతిక్రమణము నీ వినాశమునకు మాక్రోధ మింక నిమిత్తమాత్రమే యగును లే.

సహ:—ఆర్యా! ఆ దురాత్ముఁ డప్పుడైనఁ గృష్ణుఁడే వాసుదేవుఁ డని గ్రహింపలేదు కాఁబోలును !

భీమ:—వత్సా ! మూఢుఁ డతఁ డెట్లు తెలిసికొనఁగలఁడు ?

మ. స్థిరమై యొప్పెడి నిర్వికల్పకసమా
ధిన్ బుద్ధులన్ నిల్పి దు
స్తరదుర్వార తమోగుణంబు విమల
జ్ఞానంబునన్ ద్రోచి యా
త్మ రముల్ కాంచెడి జ్ఞానమూర్తిని దురా
త్మ క్రూరదుర్మోహుఁ డా
కురురా జెట్లు గ్రహింప నేర్చుఁ? గను నై
కుంఠాత్ముఁగాఁ గృష్ణునిన్ ? ౨౨

మైత్రేయా! గురువు లిపు డేమి చేయుచున్నారు ?

కంచు:—కుమారా! నీవే వచ్చి యన్నియుఁ దెలిసికొనుము.

(తెరలోఁ గలకలము. తరువాత)

ఓహో! ద్రుపదవిరాట ప్రభృతి మహారాజులారా! సైన్యప్రధాన యోధులారా! వినుఁడు.

మ. మును సత్యవ్రతభంగభీత మయి యొ
ప్పం గాంచియుఁ మందమై
ఘనవంశస్థిరశాంతిఁ గోరి యెటులో
కన్పట్టె లేనట్టులే
యన, ద్యూతారణి ద్రౌపదీవసన కే
శాకర్షణఁ బుట్టి రాఁ
జినకౌంతేయక్రుధాగ్ని యే కురువన
శ్రీఁ గాల్ప జృంభించెడిఁ. ౨౩

భీమ:—(విని సంతోషముతో) జృంభించుఁగాక! జృంభించుఁగాక! ఆర్యకోపజ్యోతి తిరుగులేక వెలుఁగొంది ప్రజ్వరిల్లుఁగాక!

ద్రౌప:—నాథా! లయకాల మేఘధ్వనివలె భయంకర మైన రణదుందుభి యిపు డనుక్షణ మిటు మ్రోఁగుచున్న దేల?

భీమ:—దేవీ! ఏమియును లేదు. యజ్ఞ మొకటి జరుగుచున్నదిలే.

ద్రౌప:—(ఆశ్చర్యముతో) ఏమి యజ్ఞము?

భీమ:—రణయజ్ఞము. ఎట్లన,

చ. నలువుర మేము ఋత్విజు ల
నఁ, హరియే యుపదేష్ట; ధర్మజుం
డలరును సోమయాజి యయి;
యాదువు నీవును సోమిదమ్మవుఁ;

ఖలు లగుకౌరవుల్ పసులు;
కాంతపరాభవదుఃఖశాంతియే
ఫలము, నరాధిపాళిఁ బిలు
వంగను మ్రోఁగెడుఁ గీర్తి దుందుభుల్." ౨౮

సహ:—ఆర్యా! మనమును గురునాజ్ఞఁ గొని పరాక్రమము చూపుదము రమ్ము.

భీమ:—వత్సా! సిద్ధముగ నున్నాను. (లేచి) దేవీ! కురుకుల నాశనమునకుఁ బోయి వచ్చెదము.

ద్రౌప:—(కంట నీటితో) నాథా! అసురులఁ జంపి వచ్చిన హరి వలె నీవును శత్రువులఁ జంపి వత్తువుగాక!

చేటి:—దేవా! మీరు రణరంగమునుండి విజయగర్వమున వచ్చి దేవి నూఱడింతురుగాక యని యామె యనుచున్నది.

భీమ:—దేవీ! ఏల యీవట్టి యూఱడింపులు.

గీ. పరిభవక్లాంతి లజ్జా విధురిత ముఖుని
నిరవశేషిత కౌరవ్య నిఖిల నిచయు
నను వృకోదరు నింక నెన్నఁడును నీవు
చూడవు నిజంబు నమ్ముమీ సుందరాంగి! ౨౯

ద్రౌప:—నాథా! నాకు జరిగిన యవమానమువలన నీకుఁ గలిగినకోపమున నేమాత్రము యుద్ధరంగమున నేమఱి యుండకుము. రిపు లప్రమత్తులుగదా!

భీమ:—దేవీ! మేము రణభీరులము కాము. సుక్షత్రియుల మేలే. ఏలన,

సీ. అన్యోన్య కోపాధికాస్త్రాల సంభిన్న
కరిరక్తమస్తిష్క కర్దమంబు;
ఆకర్దమంబున నత్యంతమగ్నమౌ
రథసమూహంబు; లారథసమూహ
ములపయిఁ గమియించు బలవంతులౌ పదా
తులగుంపు; వారి యుద్ధురరణంబు;
రక్తపానప్రీతి రసదశివసృగాల
తూర్యనృత్యోత్క బంధౌఘమయము
గీ. నగుచు బీభత్సరసమున కాలవాల
మయిన సంగ్రామ వార్ధి మధ్యప్రభీత
జలములందునఁ జరియించి జయముఁ గాంచు
పండితాఖండులే చుమీ! పాండు సుతులు. ౨౬

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది

ప్రథమాంకము.

విష్కంభము

కంచుకి:—(ప్రవేశించి) "భానుమతీదేవి గాంధారీదేవికి వందన మొనరించి వచ్చినచో ముం దామెను జూచి తరువాత నభిమన్యునిమరణమునకుఁ గారకు లైనకర్ణాదులను బహూకరింపఁ బోవలయును. కావున, నామె వచ్చినదేమో చూచి ర" మ్మని దుర్యోధనమహారాజు నా కాజ్ఞాపించెను గదా! ఇఁక నే నాలసింపరాదు. ఆహా! ముదిసగ్గు నయి కదలమెదల లేనినాకు సైత మింతపని కల్పించినది రాజాజ్ఞా బలముకదా! నావార్ధక్యదశ ననుకొనఁ బని లేదు. అంతఃపురపరిచారకు లెల్లర కిట్టివేషచేష్టలు క్రొత్తవి కావుగదా!

చ. కనఁ గలశక్తి యున్నఁ గనఁ
గాదు; వినం గని చెప్పఁ గాదు; చే
తను దృఢగాత్రుఁడుఁ గొలువు
దండము నూనక యుండఁ గాదు; లో
ననవరతంబు సందియమె
యూటఁ దడంబడుఁ గాళ్లు; రాజసే
వను గల విన్నిపాట్లకట!
వచ్చెనె క్రొత్తగ వార్ధకంబునన్. ౧

(ముందు కేఁగి, ఆకసమువంకఁ జూచి) ఓసీ! విహంగికా! దేవి యత్తమామలను సేవించి వచ్చినదా? (చెవి యొగ్గి) ఏమనుచున్నావు? వచ్చి మగనికి జయము కావలయు నని నియమనిష్ఠలతో బాలోద్యానమునఁ గలదేవాలయములో

నున్న దనియా? సరే. నీవు పోయి నీపని చూచుకో. నే నీసంగతి మహారాజునకుఁ జెప్పెదను. (ముందు కేఁగి) సతీమణీ! మంచిది. మంచిది. మహారాజుకంటె నీవే మెఱుఁగు. శ్రీకృష్ణభగవానునితోసైతము పాండవులు నెత్తిపై కెత్తి వచ్చినను రాజు పురవిహారము విడువలేఁడాయె! (ఆలోచించి) స్వామిపను లేమియు బాగు లేవు. ఏలన; ఈతఁడు:

మ. తొలి శస్త్రాభ్యసనంబునుండి త్రిజగ
ద్దోర్వీర్యుఁడౌ గంద్రగో
డ్డలిదాల్పన్ భృగురాము గెల్చినయశం
తప్రజ్ఞుఁడౌ భీష్ముఁడ
మ్ములశయ్యం బడ నేడ్వఁ; డర్జునను తాఁ
మోఘాస్త్రి యుంధాను యో
ధులు విక్రమించి సమష్టిఁ జంప బుసుతన్;
తోషించు నెంతెంతయో. ౨

అన్నివిధముల నిఁక దైవముతక్క మేలుచేయఁ గలవారు మా కెవ్వరును లేరు. దేవి యిట నున్న దని పోయి మహారాజుతోఁ జెప్పెదను.

(నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

---

# వేణీసంహారము

## ద్వితీయాంకము

[ఆసనమున భానుమతీదేవి-దగ్గఱగా సఖి సువదన, చేటి తరళిక ప్రవేశింతురు.]

సువ—భానుమతీ! దుర్యోధనమహారాజుభార్యవై యుండి యీ మాత్రపుఁబీడకల కింతగా వంత నొందుట వేల ?

తర:—దేవీ! సువదన నిజము పలికినది. నిద్రించినవారికిఁ గలలు కలవరింతలు వచ్చుట లోకసహజముకదా!

భాను:—చెలీ! ఇది సామాన్యపుఁగల కాదు. నిజముగా నిది యేదో కీడు తేఁ గల దనియే నాభయము.

సువ:—అట్లైన నీకు వచ్చిన కల యేమో చెప్పు. మేము దానికిఁ దగినవిఱుగుడు లగునీవులచేతను నోములచేతను నేలవేల్పులదీవనలచేతను దదరిష్టములను బోఁగొట్టుదుము.

తర:—సువదన యన్నది బాగున్నది. చెడ్డకలలైనను నోములు మున్నగు మంచిపనులచేఁ జెడ్డఫలము కాక మంచిఫలమే యిచ్చును.

భాను:—సరే. చెప్పెదను. సరిగా వినుము.

సువ:—ఊఁ. చెప్పు.

భాను:—చెలీ! నాకుఁ గలిగిన వెఱపువలన నది మఱచిపోతినే. జ్ఞప్తికిఁ దెచ్చుకొని నెమ్మదిమీఁదఁ జెప్పెదనులే.

(దుర్యోధనుఁడు, కంచుకి, ప్రవేశింతురు)

దుర్యో:—ఎవఁడు చెప్పినాఁడో కాని యీమాట దొడ్డమాట:

గీ. ఎదుట నైనను జాటుగా నేని తానో
యొరులొ యెవ్వరో కొలఁదియో యున్నతంబొ
యైనయపకృతి పగవాని కమరఁ జేయ
నవిరళానంద మొందు నిక్కముగ నరుఁడు. ౧

కావున, ద్రోణకర్ణసైంధవాదులచే నభిమన్యుఁడు చచ్చుట వలన నాప్రాణములకు హాయి కలిగినది.

కంచు:—ఆచార్యులగు ద్రోణులయస్త్రశక్తి కిది గౌరవప్రదమా? కర్ణసైంధవులకుమాత్ర మిది యెంత కీర్తికరము?

దుర్యో:—ఒంటిగానిపై నందఱొక్కపెట్టునఁ బడి విల్లు విఱిచి చంపుటే న్యాయ మని కృష్ణుఁ డన్నాఁడుకదా! మఱి:

క. భండనమున గాంగేయు శి
ఖండిని ముందుంచుకొనియొకా చంపిన దా
పాండవులు; వారి కది తగ,
దండిమగల మైనమాకుఁ దగు నీయశముల్. ౨

కంచు:—దేవా! నీ విట్లు సరిపెట్టుకొనుట తగదు. నీపౌరుష మిట్లు కుంఠిత మగు నని మున్నెన్నఁ డనుకొనము. కాన, నట్లంటిని.

దుర్యో:—ఓయీ! నిజమే.

గీ. సేవకులతోడ బాంధవశ్రేణితోడ
భ్రాతృసుతమిత్రబహుళవర్గములతోడ
స్వీయబలముల సని యుధిష్ఠిరుఁడు కూల్చు
సత్యము సుయోధనుని; నింక జంక నేల ? 3

కంచు:—(చెవులు మూసికొని) పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక! అమంగళము ప్రతిహత మగుఁగాక!

దుర్యో:—ఏమి ? నే నేమంటిని?

కంచు:—"గీ. సేవకులతోడ..." (అనుపద్యము చదివి) యుధిష్ఠిరుఁడు సుయోధనుని గూల్చు నని విపరీతముగఁ బలికితి వేల ?

దుర్యో:—భానుమతి నాతోఁ జెప్పక యెటకో లేచిపోయి నది. అందువలన నామతి చలించినది. ఆమె యెట నున్నదో చూపుము.

కంచు:—దేవా! ఇటు. ఇటు.

(ఇరువురును నడతురు)

కంచు:—(ముందు చూచి యంతటను సుగంధ మాఘ్రాణించి) దేవా! చూడుము. చూడుము, మంచుతుంపరులచేఁ జల్లనైనయీయుదయ కాలపులేగాలులవలనను, గూళ్లలో మేలుకొని శ్రుతి సుఖముగాఁ గలకలధ్వనులు చేయుచుఁ బక్షులు తమ ఱెక్కలు కదల్చుటవలనను, నిటునటు కదలుచుఁ దోఁడిమ

లూడిపోవఁ దరువులనుండి రాలిపడు చక్కనిపువ్వులు పఱ
పులు గాఁగా హృదయంగమముగాఁ గమ్మతావులఁ జిమ్ము
కుందపుష్పములసౌరభముతో నొప్పునీబాలోద్యానము :

ఉ. మాపుల విచ్చుపూవులను
మంచును దేనెను గూడిమాడియుఁ
దేపటిప్రొద్దు భూమిపయి
దివ్వనఁ బూలును దాము రాలిపో;
నాపయి సూర్యకాంతి విరి
యంగఁ దొడంగుచుఁ గమ్మతావులన్
వ్యాపనచేయుపద్మముల
వ్రాలెడుఁ జూడుము చంచరీకముల్. ౮

మనో:—(బాగుగాఁ జూచి) ఇది మఱియు మనోహరముగా
నున్నది :

చ. అరవిరిదమ్ము లంతటను
నల్లన నల్లన విచ్చఁ బత్త్రముల్
సురుచిరభానుహస్తములు
సోఁకఁగ వేఁడిమి కుల్క యాంద్రతో
నరవరుఁడీవి మేలుకని
నన్ మయిపూఁతలు ప్రేమఁ దెల్పఁగా
సరససరోజపత్త్రమృదు
శయ్యల వీడెడు గండుఁదుమ్మెదల్. ౯

కంచు:—దేవా! సువదనయుఁ దరళికయు సేవింప దేవి యిట నున్నది. చూడుు.

దుర్యో:—(చూచి) సరే. నీ వేగి రథమును సిద్ధము చేయుము. నేను దేవిని జూచి వచ్చెదను. (నిష్క్రమించును)

కంచు:—చిత్తము.

సువ:—నెచ్చెలీ! మఱచినకల జ్ఞప్తికి వచ్చినదా ?

భాను:—ఆఁ. వినుము. నే నీపూఁదోఁటఁ గూర్చుండి యుండఁగా నొకచక్కనిముంగిస నూఱుపాములను జంపినది.

ఉభ:—(తమలో) పాపము శమించుఁగాక! అమంగళము ప్రతిహతమగుఁగాక! (ప్రకాశముగా) తరువాతఁ దరువాత ?

భాను:—నామనస్సు కలఁగిపోయినకారణమునఁ దరువాతి సంగతి మరల మఱచిపోతిని.

దుర్యో:—సరి. సువదనాతరళికలతో దేవి యేదో మాటాడుచుఁ గూర్చున్నది. ఈగుబురుతీఁగలమాటున నుండి వీరి మాటలు విందును.

సువ:—దేవీ! వగ లుడిగి తరువాత నేమి జరిగినదో చెప్పు.

దుర్యో:—ఈమెవగ యేమోకదా! ఓహో! నాతోఁ జెప్పకే యిలు వెడలి వచ్చినదికదా! నాపైఁ గోపము వచ్చిన దేమో ? దేవీ ! దుర్యోధనుఁడు నీకోపమునకుఁ దగని వాఁడుసుమా ?

ఉ. కోమలి! నీవు బాహులతఁ

గూరిమిఁ గంఠము చుట్టువేళ నే

నేమఱి తోఁగిసివేసితినో ?
యీావు నన్నుఁ గనువేళ నిద్రచే
భామిని! మోముఁ ద్రిప్పితినో?
పాడితినో కల నన్యకాంత ? నే
నేమి యొనర్చితినిఁక ప్రియ ! య
నిష్టము దాసులఁబోలెఁ దిట్టఁగన్ ? ౬

(ఆలోచించి) కాక :

గీ. పొలఁతిచిత్తంబు నాయందె నిలువఁబట్టి
యతిశయస్నేహసంబద్ధ మానసూయ
నేదో యపరాధలేశ మూహించి దేవి
కుపితయై యుండఁబోలు నిక్కువపుఁబ్రేమ. ౭

ఐన, నీమె యే మనునో విందునుగాక !

భాను:—చెలీ ! కాని, నా కాయతిశయదివ్యరూపసకులసందర్శనమున మాత్రము మిక్కిలిసంతోషము కలిగినది.

దుర్యో:— ఏమి ! అతిశయదివ్యరూపసకులసందర్శనమున సంతోషము కలిగినదా? అయ్యో! మాద్రీసుతుఁ డగునకులునియం దనురక్తయైన యీామెవలన నే నెంత మోసపోతిని! (సోత్ప్రేక్షముగా "పొలఁతిచిత్తంబు..." అనుపద్యము మరలఁ జదివి) ఓరీ! మూఢా ! దుర్యోధనా ! కులటా విప్రలబ్ధుఁడవై నీవు ని న్నెన్నివిధములుగానో మన్నించుకొంటివి. ఇపు డే మందువు ? ("కోమలి ! నీవు" అనుపద్యమును మరలఁ జదివి దిశలు చూచి) సరే. తెలిసినది. ఇందులకే కాఁబోలు నీమె

కుదయముననే యేకాంతముగా నుండుటకుఁ గోరికపుట్టుట!
సఖులతో సల్లాపించుట? మోహావశుఁడై దుర్యోధనుఁ డీమె
హృదయము నెఱుఁగక మోసపోయెనుగదా! ఓపాపినీ!
నాభార్యవయ్యుఁ గులట వైననిర్భాగ్యురాలా!
చ. అతివినయంబు చెంగటను;
సవ్వల నింతటిసాహసంబు ; సం
స్తుతులు కుఱంగటన్ బ్రణయ
ముం గికురించెడువర్తనం బిటుల్;
సతులు సమీపమం దటు ల
సన్ వినరానికుచేష్టితంబు లీ
గతిని, దురాత్మురాల! యిటు
కాల్తువె సత్కులకీర్తిచంద్రికల్ ? ౮
సువ:—తరువాతఁ దరువాత ?
భాను:—అంత నే నిపుడు కూర్చుండియున్నతీఁగయిల్లు చేరి
కూర్చుంటిని. నన్ననుసరించి యానకులకుమారుఁడు నిటకు
వచ్చి కూర్చుండెను.
దుర్యో:—ఆహా! ఈజారిణి కిటు చెప్పుకొనుటకు సిగ్గయిన
లేదే ? ఇది కులటకు సహజమేకదా ! ఈమె:
గీ. అతి చిరంతన స్నేహభావాభివృద్ధి
నాత్మరతిభోగ మేకాంత మైనరీతి
నేచెలికిఁ జెప్పు నాచెలి కిట్లు తనదు
దుశ్చరిత్రను జెప్పంగఁ దొడఁగె నార ! ౯

సువ.తర:—పిమ్మట ?

భాను:—అంత నాతఁడు పొగరునఁ దనచేతితో నాపైఁట తొలఁగించెను.

దుర్యో:—(ఆలోచించి) ఇది చాలును. ఇఁక, విన సక్కఱ లేదు. అగుఁగాక! పరవనితలఁ బట్టుటలో నిట్లు నిపుణుఁడైనయానకులహాతకుని యసువుల నిదే తీసివేయుదును. (అడుగిడి యాలోచించి) లేక యీపాపశీలను ముందే కడ తేర్తును. (మరలును)

సువ.తర:—తరువాత? తరువాత ?

భాను:—సఖీ! అంతట నార్యపుత్త్రుని వేకువమేలుకొలుపు మంగళవాద్యములతోఁ గలిసినవారకాంతలసంగీతములచే నేను మేల్కాంటిని.

దుర్యో:—(ఆలోచించి) ఏమి? మేలుకొంటి ననుచున్నది. కల గన్నవిషయమా యిది? (మరల నాలోచించి) సరే. సఖి మాటలవలన నిదియుఁ దేలఁ గలదు.

సువ.తర:—(విచారముతో నొండొరులఁ జూచుకొందురు) (ప్రకాశముగా) దేవీ! ఈయహితమును గంగానదీజలములవలనను, భగవాను లగు బ్రాహ్మణులయాశీర్వచనములవలనను, సప్తజిహ్వునకు హోమములు చేయుటవలనను బోఁగొట్టుకొందములే.

దుర్యో:—సరి. సందేహ మేల? కలగన్నవిషయమే యీమె చెప్పినది. నేను మందబుద్ధినై వేఱుతెఱఁగున నూహించితిని. అదృష్టము.

మ. అరమార్తుఁ విని విప్రలంభజనితో
ద్యత్రోధిని పోవ లే,
దరయం దక్షిణమాటచే రసను నో
రారంగఁ బల్కంగ లే
దు. రహిన్ దత్కథయుం సమాప్తమయెఁ దో
ష్ఠో నేను నమ్మంగఁ; బు
ణ్యారమన్ గాంత మృషాకళంకమునఁ బా
యం లేదు జీవం బహో ! ౯

భాను:— సఖి! ఈకలవలని శుభాశుభము లేవో చెప్పుము.

సువ.తర:—(ఒకరినొకరు చూచుకొని అపవారించి) ఇం దేమాత్రము శుభము లేదు. అసత్యము చెప్పరాదుగదా! అది యప రాధమే యగును. పరుషమైనను ప్రియసఖులకు హితమే చెప్పవలయును. (ప్రకాశముగా) సఖి! నిజమున కిది యంతయు నశుభమునే సూచించుచున్నది. దేవతల దయవలన బ్రాహ్మణులకృపవలన నిది తొలఁగిపోవును. కోఱలు గలజంతువును, ముంగిస, కోఁతిని గలలోఁ గనరాదు. నూఱుపాముల నది చంపుటయు మంచిది కాదు.

దుర్యో:—సువదన యన్నది నిజమే. ముంగి నూఱుపాములఁ జంపుట, దేవిపైఁట దొలఁగించుట, యివి యమంగళములే యగును:

క. ఒకపరి శుభసూచకములు వే
ఱొకపరి నశుభంబు లగుచు నొప్పును గలలుం;
వికలత కలిగెను శతనా
మకసంఖ్యను దమ్ములగమిని మాకది తగుటన్. ౧౦

(ఎడమకన్ను దరుటఁ గని) దుర్యోధనుఁడ నగు నాకు సైత మనిమిత్తములు పుట్టుచున్నను గలఁచుచున్నవి. (గర్వముతో) కాదు, కాదు. పిఱికివానినిమాత్రమే కలఁచు నట్టివానివలన దుర్యోధనుని కేమి భయము ? అంగిరసుఁ డనుమునిచెప్పిన యీమాట లెంతయు సత్యములు;

క. కల, శకునము, గ్రహమును, భూ
తలమున ఫల మిచ్చుఁ గాక తాళీయముగాఁ
జలియింపఁడు ప్రాజ్ఞుఁడు త
త్ఫలమున కిసుమంతయైన ధైర్యము పేర్మిన్. ౧౧

కావున, స్త్రీస్వభావసిద్ధ మగుభానుమతిభయమును నేను బోఁగొట్టుదును.

భాను:—చెలీ! సువదనా! తనకాంతిపుంజము విరజిమ్ముటచే సంధ్యారుణిమ పోఁగాఁ జూచువారికన్నులఁ బొడుచుచు సూర్యభగవానుఁ డిదే యుదయించుచున్నాఁడు.

తర:—భట్టినీ! పుటము వెట్టినబంగారముతో సమానమైనకాంతి పుంజమును దట్టముగా నల్లుకొన్నతీఁగలనడుమునుండి ప్రస రింపఁజేసి మనయుద్యానవనమునకు బంగారునీరు పోయుచుఁ జూడ నలవికానిరీతిని సహస్రకరభగవానుఁ డాకాశ మలంక రించినాఁడు. అతనికిఁ బుష్పాంజలులతో నర్ఘ్య మొసఁ గుట కిదే యదను.

భాను:—చెలీ! తరళికా! అర్ఘ్యపాత్ర మిటు తే. వేయివెలుఁ గులతండ్రి నుపాసించెదను.

తర:—అట్లే. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఇదిగో.

దుర్యో:—దేవికడ కేఁగుట కిదే యదను. (సమీపించును)

సువ:—(చూచి తనలో) మహారాజేలొకో కాని వచ్చు చున్నాఁడు. ఈమెకు నియమభంగ మగునుగదా !

భాను:—(సూర్యునివైపు తిరిగి) భగవానుఁడా! ఆకాశసరోవరమున కేకైకసహస్రపత్త్ర మైనయో దేవా! పూర్వదిగ్వధూముఖమండలకుంకుమవిశేషా! సకలభువనమునకు నేకైకరత్నదీపమా! నాయీవందనములఁ గైకొని నేఁటినాస్వప్నదుర్నిమిత్తములు సానుజుఁ డగునాపతికి శుభప్రదములుగా మార్చివైతువుగాక! (అర్ఘ్య మిచ్చి) తరళికా! పూలు తెమ్ము. ఇతర దేవతలను సేవించెద. (చేతులు చాఁచును)

దుర్యో:—(సంజ్ఞచేఁ బరిజనులఁ బొం డని పూలు స్వయముగా భానుమతిచేతులలో వేయఁబోయి స్పర్శసుఖపరవశతను బువ్వులు నేలపై విడుచును.)

భాను:—(కోపముతో) ఏమి! దాసిజనమున కింత యేమఱుపాటా? (మరలి రాజును జూచి సిగ్గుపడును)

దుర్యో:—దేవీ! ఇట్టిసేవావసరమున నీసేవకుఁ డంతనిపుణుఁడు కాఁడు. శిక్షణ మిచ్చి యేలుకొనుము. ఓప్రియా!

శా. వాలుంగంటి! భవత్కటాక్షవిలస
ద్భాగ్యంబు నర్థించి నీ
పాలం జేరినదాసునిం గని భయ
భ్రాంతాత్మ వౌ దేటికే?
ఆలాపింపు ముఖాంబుజంబు స్మితసా
హాయ్యంబునన్ ఫుల్లమై
క్రాలన్. మోడ్చెదఁ గేలుదోయిని, సప
ర్యల్ చేయ సంసిద్ధుఁడన్. ౧౩

భాను:—మహారాజా! అనుమతింపుఁడు. నా కింకొకనియమ
ము పైఁ గోరిక కలదు.

దుర్యో:—నీకలగన్న సంగతి యంతయు వింటిని. సహజముగా
నతిసుకుమార మైననీశరీరము నింత క్లేశపెట్టకుము.

భాను:—ఆర్యపుత్త్రా! న న్నొకశంక మిక్కిలి బాధించు
చున్నది. అనుమతింపుఁడు.

దుర్యో:—(గర్వముతో) నీ కేశంకయుఁ గూడదు. ఏలన:

మ. ఇల కంపింప దిశాళి నిండినఘలం
బేదీ మదక్షౌహిణీ
బలముల్? ద్రోణుఁడు కర్ణుఁడున్ గలుగ లా
భం బేమి? నీ విట్లు గాన్.
లలనా! భ్రాతృశతాస్మదీయబలకాం
తారాంతరచ్ఛాయలన్
గలదుర్యోధనకేసరీంద్రసతి! శం
కాతంక మింకేటి కే? ౧౮

భాను:—ఆర్యపుత్త్రా! నీదగ్గఱ నాకు శంకకుఁ గారణ మేమి
యును లేదు. ఆర్యపుత్త్రునికోరిక సిద్ధింపవలయు ననియే
నేఁ గోరుచున్నాను.

దుర్యో:—ఓసుందరీ! ఐన, నీతో విహరించుటే నాకోరిక.
చూడు.

మ. అనురాగ స్తిమితాక్షియుగ్మ మది ప
ద్మానంతశోభన్ నగన్;
ఘనలజ్జన్ బలుకుల్ తడంబడఁగఁ; జి
ర్ణవ్యాప్త లోలోనఁ; బెం

పును గఁ లత్తుకతోడికెంబెదవి చె
ల్వొందఁ సఖీ! పూర్ణచం
ద్రునికాంతిఁ బురుడించునీముఖము గా
దో దుర్లభం బెంతయున్. ౧౫

(తెరలో మహాకలకలము. అందఱు సంభ్రమముతో విందురు)

భాను:—(దుర్యోధనుని కౌఁగిలించుకొని) ఆర్యపుత్రా! రక్షింపుము. రక్షింపుము.

దుర్యో:—(అంతయుఁ గలయఁ జూచి) భయపడకు. సఖీ! భయపడకు. ఇదిగో:

ఉ. పాదపపంక్తి పెల్లగిల
బంధురకాండకషంబునన్ బొగల్
మేదిని గ్రమ్మఁగాఁ దృణస
మీరితమై దివి ధూళి రేఁగఁగా
నాదము లుప్పతిల్లి భవ
నంబుల మేడలఁ జేర శర్కరా
పాదితమై జగం బులియ
వాయువు వీచెడు భీతి యేటికిన్? ౧౬

సువ:—మహారాజా! దారుపర్వతప్రాసాదమును బ్రవేశింపుఁడు. ఈపెనుదుమారము కన్నులఁ గప్పివేయుచున్నది. పెళపెళ మని పడుచెట్లధ్వనివలన నశ్వశాలలోనిగుఱ్ఱములు బెదరి కట్లు ద్రెంచుకొని పరుగులెత్తుచున్నవి. పరిజనులెల్లరును మూలల కొదిఁగిరి. ఈగాలిబాధ చాల భీకరముగ నున్నది.

దుర్యో:— ఈసుడిగాలి నిజముగా నాకు మహోపకారి. ఏలన, దీనిదయవలననే యప్రయత్నముగా నియమము విడిచి దేవి నామనోరథ మీడేర్చినది. ఎట్లన దేవికి :

మ. కనుబొమ్మల్ ముడి గాంచ లేదు; మఱి పొం
గఁగ లేదు కన్నీరు; మో
మును గోపంబును గాంచ లేదు; శపథం
బుల్ పల్కి వారింపకే;
స్తనముల్ హత్తి యొసంగె నా కిటు ప్రసి
ద్ధం బైనయాలింగనం
బును భీతాత్మత దేవి; యీపవన మా
ముఖ్యాత్మమిత్రం బహో! ౧౭

నాకోరిక సిద్ధించినది. ఇంకఁ గామచారమునకు దారుపర్వత ప్రాసాదమునకే పోవుదును. (అందఱు వాయుబాధచేఁ గష్టమున నడతురు.)

దుర్యో:— దేవీ !

గీ. మెల్లమెల్లన నడుగుల నుల్లసిల్లఁ
జేసి నడువుము వణఁకకు స్నిగ్ధబాహు
లతికఁ బెనవేయుమీ నన్ను సతి! యురంబు
గాఢకుచఘర్షణంబున గాయపఱుప. ౧౮

(ప్రవేశించి) ప్రియా! ఈలోపలియింటిలోనికి గాలి చొరఁజాలదు. కనులలోఁ బడినఁనలకలు తుడుచుకొని కన్నులు తెఱువుము.

భాను:—(ఆనందముతో) అబ్బ! గాలిబాధ తగ్గినది.

సువ:—మహారాజా! దేవితోడలు పర్వతారోహణమున నలసి నవి. ఆసనము నలంకరింపుఁడు.

దుర్యో:—(భానుమతిని జూచి) ఈసుడిగాలి నీకుఁ జేసినకీడు స్వల్పమే. ఐనను:

చ. నలుసులు చిన్నవైన నయ
 నంబులు పెద్దవి కాన బాధ యౌ;
 నలఁతియె కంప మైనను గు
 చాత్మకవక్షము ధూతహార మౌ;
 విలసిలుఁ గంపముల్ జఘన
 విస్తృతి యూరులఁ జేరినంతనే;
 చెలియ! త్వదంగముల్ పవను
 చెల్మిని నిన్నిటు బాధపెట్టెడుర్. ౧౯

(అందఱును గూర్చుందురు)

దుర్యో:—ఏమి? దేవి కఠిన మైనశిలాతలమునఁ గూర్చున్నది! దేవీ!

గీ. గాలిచేతను నీయంశుకంబు తొలఁగఁ
 గనులపండువు గొల్పునీఘనజఘనము
 గౌరవించును నాయంశుకంబు తొలఁగ
 నువిద! నీచూపుఁ దన్పు నాయూరుయుగము. ౨౦

(కంచుకి తెరఁ జించుకొని తత్తఱమునఁ బ్రవేశించును.)

కంచు:—దేవా! భగ్నము. భగ్నము.

దుర్యో:—ఎవనిచే.

కంచు:—భీమునిచే.

దుర్యో:—ఏమి యీ [యనర్థక] ప్రలాపము?

భాను:—ఆర్యకంచుకీ ! నీవు చెప్పఁదలఁచినది స్పష్టముగఁ జెప్పుము.

దుర్యో:—ఛీ! ప్రేలరీ! ముదివగ్గా! నీ కీపిచ్చి యెట్లు కలిగినది?

కంచు:—దేవా! భ్రాంతి లేదు. నిజమే చెప్పుదును:

గీ. భగ్నమయ్యె వృకోదరపవనుచేతఁ
బ్రీతిఁ గూర్చెడినీరథకేతనంబు
కింకిణీక్వాణబద్ధమై క్రిందఁబడియె
బిగ్గరగ నేడ్చునట్టు లప్రియకరముగ. ౨౧

దుర్యో:—ఈపెనుగాలిచే భూమియే కంపించినది. రథకేతనము పడుటలో వింత యేమి? ఇంతమాత్రమున కంతగా భగ్నమైన దని ప్రేలెద వేల ?

కంచు—దేవా! ఏమియును లేదు. ఈయనిమిత్తమునకు శాంతి చేయుఁడని తమతోఁ జెప్ప నాస్వామిభక్తి నన్నట్లు పలుకఁ జేసినది.

భాను:—ఆర్యపుత్రా! ఈయనిమిత్తములను విప్రమండలాశీర్వచనఘోషమునఁ బోఁగొట్టుకొందము.

దుర్యో:—సూతుఁడా! నీవు పోయి సుమిత్రుఁ డనుపురోహితునితోఁ జెప్పుము.

కంచు:—చిత్తము. (నిష్క్రమించును)

(ప్రవేశము : ప్రతీహారి)

ప్రతీ:—(ఉద్వేగముతో) జయము! జయము! మహారాజా! అల్లురగు జయద్రథులవారితల్లియు దుస్సలకుమారియు వచ్చి ద్వారముకడ నున్నారు.

దుర్యో:—(తనలో) ఏమి! జయద్రథమాతయు దుస్సలయునా? అభిమన్యునిమరణమునఁ గలిగినకోపమునఁ బాండవు లేమైన నుపద్రవముఁ గలిగించిరేమో? (ప్రకాశముగా) త్వరగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ:—చిత్తము. (నిష్క్రమించును)

(అంత సంభ్రాంతలై జయద్రథమాతయు దుస్సలయుఁ బ్రవేశింతురు.)

ఉభ:—(కన్నీటితో దుర్యోధనుని పాదములపైఁ బడుదురు.)

జయ:—కురునాథా! రక్షింపుము. రక్షింపుము.

దుస్స:—(ఏడ్చును.)

దుర్యో:—(తొందరగా లేచి) అంబా! ఊఱడిల్లుము. ఏమి సంగతి? సంగ్రామమున నప్రతిరథుఁ డగుజయద్రథునకుఁ గుశలమేకదా!

జయ:—నాయనా! ఏమి కుశలము?

దుర్యో:—ఏమి?

జయ:—(దుఃఖముతో) నిజపుత్త్ర వధచేఁ గోపిష్ఠుఁడై యర్జునుఁడు సూర్యుఁ డస్తమించులోపుననే జయద్రథుని వధింప శపథము పట్టినాఁడు.

దుర్యో:—(నవ్వుచు) ఇదియా! మీదుఃఖకారణము! పుత్త్రశోకమునఁ బిచ్చియెత్తి యర్జునుఁడు ప్రేలినమాటల కిట్లు సంతాపింతురా? ఆహా! ఏమి! అబలలముగ్ధత్వము. అంబా! విషాద మందకుము. వత్సా! దుస్సలా! ఏడువకు. ఇట్టి దుర్యోధనరక్షితుఁ డగు జయద్రథమహారాజున కెట్లు విపత్తు కలుగును?

జయ:—వత్సా ! పుత్త్రబంధువధవలనఁ గలిగినకోపాగ్నిచేఁ బాండవులు శరీరములను సరకుగొనక వీరవిహారము చేయుచున్నారు.

దుర్యో:—(నవ్వి) ఔను! పాండవులకోపము సర్వజనప్రసిద్ధమే. చూడుము:

చ. కరమునఁ గొప్పుపట్టి పయి
గా నటు లీడిచి కట్టుఁబుట్టముల్
తొరఁగఁగ విప్పి యాసభను
ద్రోవది "నోపశువా!" యటంచుఁ బ
ల్మరు లటు పిల్వఁగా నచట
ప్రాన్పడి యుండఁడె యగ్రజుండు; నిం
కరయఁగ రాచపుట్టువున
కన్యము గల్గునె క్రోధహేతువుల్ ? ౨౨

జయ:—జాతా ! తనప్రతిజ్ఞ నెఱవేఱనిచో నాత్మహత్య చేసికొందు నని యాతనిశపథము.

దుర్యో:—ఐన, మఱియు మంచిది. ఈ యానందవిషయమున కిటు విషాద మందుదురేల? యుధిష్ఠిరుఁడు తమ్ములతో నశించె ననియే యానందింపుఁడు. ధనంజయునకుఁ గాని మఱి యన్యునకుఁ గాని కురుశతపరివారవర్ధితమహిముఁడు, కృతవర్మకర్ణద్రోణాశ్వత్థామాదిమహారథద్విగుణీకృతనిరావరణవిక్రముఁడు సగుజయద్రథుని పేరైనఁ దలఁప వశమా ? నీవు నీపుత్త్రిని పేరిమి నెఱుఁగనిదానవు:

గీ. భీముశౌర్యము నర్జునువిక్రమంబుఁ
దలఁచి ధర్మజుఁ గవలను దలఁపరాదు.
వీరిలోనైన నెదిరించి పోర నెవఁడుఁ
జాలఁడు జయద్రథుఁడు విల్లు కేలఁ గొనిన. ౨౩

భాను:—ఆర్యపుత్త్రా! ఏమైన నట్టిఘోరప్రతిజ్ఞ చేసినయర్జు నుఁడు భీతావహుఁడుగదా!

జయ:—వత్సా! కాలోచితముగాఁ బలికితివి.

దుర్యో:—ఏమి! నాకును పాండవులు భీతావహులా? వినుము:

సీ. కోదండశింజినీఘోరకిణాంకులు
నగణితరిపువీరహతులు తమ్ము
లాముక్తవర్ములు నన్యోన్యమిత్త్రులు
నూర్వీరు సితపద్మనులనుబోలు
నాతపత్రంబుల నరుదేరఁ బెనురజ
మ్మాదిత్యతేజమ్ము నడఁపఁజాల
విచ్చుకత్తులు పూని విచలదసిలతాప్ర
బంధురంబుగ దెసల్ పర్వ నడవ

గీ. సకలసైన్యసుయోధులు సర్వభూమి
యీనినటు లుండి మాత్సర్య మూని శత్రు
వితతిఁ జెండాడ నెత్తి జృంభింపఁగలరు
భయ మదేటికి నీకింకఁ బాండవు లన? ౨౪

భానుమతీ! పాండవప్రభావ మెఱిఁగినదాన వయ్యు నీవును భీతిలెద వేల? చూడుము:

గీ. దుస్ససేను నెడంద నెత్తురులు ద్రావ
గదను దుర్యోధనునితొడల్ ప్రిదులఁగొట్టఁ
బాండవులు చేసియున్నట్టిప్రతిన, లటులె
సైంధవునిఁ జంపుశపథము జడియ నేల? ౨౫

ఎవ రక్కడ? చైత్రరథమును రప్పింపుము. వెంటనే నేను పాండవమధ్యముని వ్యర్థప్రతిజ్ఞునిఁ గావించి యాతని కశస్త్రపూత మగుమరణము నాపాదించెదను.

కంచుకి:—(ప్రవేశించి) దేవా!

క. బంగరుచిఱుగంటలు మ్రోయఁ
గంగను బ్రాలంబవీచికాహాసము వె
ల్లంగను వల్గితహయరథ
ముం గొని వచ్చితి క్షుపితరిపుమనోరథముఁ. ౨౬

దుర్యో:—దేవీ! నీవు లోని కేఁగుము. (వెంటనే నేను...ఇత్యాదిని మరలఁ జదువుచుఁ బరిక్రమించును.)

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

---

## ప్రవేశకము

(వికృతవేష యగురాక్షసి ప్రవేశించును)

రాక్ష:—(వికటముగా నవ్వి యానందముతో)

క. చచ్చినమనుజులమాంసము
మెచ్చగుపస నెత్రు వేయి మేల్కడవలలో
నచ్చుగ దాఁచితిఁ; ద్రావెద
నిచ్చటఁ; బో రుండుఁగాక యిల నూఱేఁడుల్. ౧

(సంతోషమున నెగిరి గంతులు వేయును) సైంధవునిఁ జంపిననాఁటి వలె నిత్యము నర్జునుఁడు యుద్ధము చేయుచున్న నాయిల్లంతయు రక్తమాంసములతోడనే నిండియుండును. (ముందుకేఁగి దెసలు చూచి) ఆహా! రుధిరప్రియుఁ డెక్కడ నున్నాఁడో? (నడచి) వానిని బిలిచెదను. రుధిరప్రియా! రుధిరప్రియా!

రుధిరప్రియుఁడు:—(ప్రవేశించి, ఆయాసపడుచు)

క. మనుజులఁ గ్రొన్నెత్తురు వె
చ్చనిమాంసము దొరకెనేని సత్వరముసఁ బో
వునుగద! నాశ్రమ మంతయు
క్షణమాత్రములోనఁ బరమసంతోషముగన్. ౨

రాక్ష:—(మరలఁ బిలుచును)

రుధి:—(విని) ఎవరి దీపిలుపు! (చూచి) ఓహో! వసాగంధ. (దగ్గఱకుఁ జేరి) వసాగంధా! నన్నేల పిలిచితివి?

రాక్ష:—ఓరుధిరప్రియా! నీకోస మిపుడే చచ్చినయొకరాజర్షి శరీరావయములనుండి దొరకి వసాస్నేహమునఁ జిక్కనైన

గోరువెచ్చని క్రొన్నెత్తురు హృదయమాంసము తెచ్చి తిని. ఇవిగో.

రుధి:—(సంతోషముతో) సెబాస్: వసాగంధా! సెబాస్. గృహిణీ! నాకు శోభనము చేసితివి. నే నీతిండి కెదురెదురు చూచుచుంటిని. నా కెంతో దాహ మగుచున్నది.

రాక్షః:—ఓరుధిరప్రియా! ఈరీతి హతనరగజతురగశోణితవసా సమ్మర్ద మైనయుద్ధరంగమున నుండియు నీవు దప్పిగొనుట నా కాశ్చర్యముగ నున్నది.

రుధి:—ఓసీ! ఘటోత్కచుఁడు చనిపోవుటవలనఁ బుత్త్రశోకమున నున్నహిడింబాదేవిని జూచిరా నేఁగితినే.

రాక్షః:—ఇంకను హిడింబాదేవి ఘటోత్కచునికొఱ కేడ్చుచునే యున్నదా?

రుధి:—ఆమె యెట్లూరకుండును? అభిమన్యునిచావున నట్టిదుఃఖములో నేయున్నసుభద్రాద్రౌపదు లామె నోదార్చుచున్నారు.

రాక్షః:—రుధిరప్రియా! పెద్దయేనఁగుపుఱ్ఱెలో నుండి తీసి దాఁచినరక్తమాంసము లివిగో. పుచ్చుకో.

రుధి:—(పుచ్చుకొని త్రాగి) వసాగంధా! నీ వేమాత్రము రక్తమాఁసముల దాఁచియుంచితివి?

రాక్షః:—వెనుక దాఁచియుంచినవి నీవే యెఱుఁగుదువు. ఇపుడు దాఁచినవి వినుము. భగదత్తునిశోణిత మొకకడవ; సైంధవునివస కుంభెఁడు. ద్రుపదమత్స్యరాజభూరిశ్రవస్సోమదత్త

బాహ్లీకప్రముఖులయు, రాజులయుఁ దక్కిన సామాన్యులయు మాంసము, వస, నెత్తురు వేలకొలఁదికడవలు.

రుధి:—(సంతోషముతోఁ గౌఁగిలించుకొని) సెబాస్. నీ వెంత మంచిభార్యవే. నీవంటి బంగరుభార్యవలన, హిడింబకృప వలన, నాదారిద్ర్యము తొలఁగినది.

రాక్ష:—హిడింబకృప యెట్టిది?

రుధి:—ఇపుడే హిడింబాదేవి నన్ను సబహుమానముగాఁ బిలిచి "రుధిరప్రియా! నీవు నేఁడుమొదలు సమరమున నార్యపుత్త్రుని వెనువెంటఁ దిరుగుచుండు" మని యాజ్ఞాపించినది. ఇఁక నా కేమికొఱఁతే? ఆఁకలిదప్పు లెఱుఁగక స్వర్గసుఖ మనుభవించెదను. నీవును రక్తమాంసములను శ్రద్ధగా వేయికడవలు దాఁచియుంచుము.

రాక్ష:—నిన్ను దేవియార్యపుత్రునితో నుండుమన్న దేల?

రుధి:—భీమసేనుఁడే దుశ్శాసనునిరక్తముఁ ద్రావఁ బ్రతినపట్టి నాఁడు. కాన, నీ వాతనిలో నుండి రక్తపానము చేయు మని నన్నంపినది.

రాక్ష:—దేవీ! మంచిది నీదయవలన నాభర్తపుణ్యము పండి నది.

(తెరలో మహాకలకలము)

ఉభ:—(విందురు)

రాక్ష:—(విని) ఏమి యీకోలాహలము?

రుధి:—ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని సిగఁ బట్టి కత్తితోఁ గుత్తుక నఱకుచున్నాఁడు.

రాక్ష:—మనముకూడ నేఁగి ద్రోణునిరక్తము త్రాగుదమా?

రుధి:—ఓసి! నీయిల్లు కాల! అది విప్రరక్తమే! అది త్రాగినఁ గంఠము మండి చచ్చిపోవుదుము.

(తెరలో మరలఁ గలకలము)

రాక్ష:—మరల నీకలకల మేమి?

రుధి:—అశ్వత్థామ కత్తి చేతఁ బట్టుకొని యిటే వచ్చుచున్నాఁడు! ధృష్టద్యుమ్నునిమీఁదికోపమున నాతఁ డేమి చేయునో? నేను బోయి హిడింబాదేవి చెప్పినట్లు చేయు

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

——

# వేణీసంహారము

## తృతీయాంకము

[ఒరనుండి తీసి పైకెత్తిపట్టినకత్తితో నశ్వత్థామ కలకల మాలించుచుఁ బ్రవేశించును.]

అశ్వ:— ఈరణభూమిని:

గీ. ప్రళయమారుతక్షుభితసంవర్తమేఘ
ఘోరగర్జితప్రతిరవకారి యగుచుఁ
జెవు లవియ రోదసియు నిండ మివులఁ బుట్టె
నెన్నఁ డెఱుఁగనియీధ్వని యేమి చెపుమ? ౧

(ఆలోచించి) నిజము. గాండీవి కాని సాత్యకి కాని భీమసేనుఁడు కాని యౌవనదర్పమున మర్యాద మీఱి వర్తించినఁ గోపించి తండ్రి విజృంభించి పాండవులమీఁదిశిష్యప్రేమ విడిచి నిజశక్తిఁ జూపియుండును. ఏలన:

మ. అల దుర్యోధనపక్షపాతసదృశం
బస్త్రగ్రహాత్యోచితం
బలఘుశ్రీభృగురామలబ్ధఘనశ
స్త్రాస్త్రానురూపంబు ని
శ్చలధానుష్కగురూత్తమోత్తమరుషా
సాధ్యంబు నాంతాతపా

